ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య—౨౨

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—। ద్వితీయభాగము ।—



అహోబలపండితప్రణీతము.

(పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము)

---

కాకినాడ:
కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.
1929.
వెల రు 0-8-0.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

---

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగునహోబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిపు డిందుఁ గలవిశేషములను వివరించెదను. ఈభాగమున ౪-౫-౬ ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందు వలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందు వలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావములతోను జేయంబడినది. చూడుఁడు :—

—। వసంతవర్ణనము ।—

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించుమానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేవ యాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌఖ్యవైక, మూలకారణ మైనట్టిమేలువాఁడు
మాధవుఁడువచ్చెనవ్వేళమధురలీల,వనరమాంగనయామోదమున మెలంగ.

సీ. పంజరగుహలలోపల నున్ని గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబుగానక గాసిల్లు మానిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్గిల్లు వరహంసవారములను
నలరునీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించుచేతనవ్రాతములను
సత్పరిగ్రహలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు నొూగితతుల
మన్నన యొనర్చెఁ దావచ్చిమాధవుండు,కామితార్థఁ బులవ్వారిగాఁగనిచ్చి.

ఇందలిశ్లేషవిశేష మెంతచక్కనిదో!

—। గ్రీష్మఋతువర్ణనము ।—

గీ. కూటిపేదతీకంబు గైకొనిరి మిగుల,నాతరముచేత బ్రతికెడునట్టివారు
ఖనన మొనరించితనుఘర్మ త్రగడపువారు,కూలిగలుగుటనవ్వేళగూఁటఁబడిరి.

క. కూటిరుచి పాన మొందెను, బొటిల్లెను నీళ్ల సుల్లు పవనంబునకున్
మేటి సురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. ౩౭

ఈ రెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటిసెక నుదుకఁగఁబడి, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. ౪౪

ఇం దాచారసంప్రదాయము కలదు.

—। వర్షర్తువర్ణనము ।—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
పారమంత్రోపాస్తిచతురుల కళనంబు వార్తగల్గుట గానివావి యయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింపఁ (బ్రార్థింప) శిఖియొకింతొసఁగినఁ జిత్రమయ్యె
జంబుగూడలకలుములు డంబుమిగిలెఁ, గతకసంపాదనంబులు ఘనతగాంచె
నన్నదాతకు నేనియు నతిథి కొకని, కైన నన్నంబు గలదను టరిదియయ్యె.

ఇది యాముక్తమాల్యదఛాయ—

"ఇల్లిల్లుఁ దిరుగ నొక్కింతబ్బు శిఖ; యబ్బెనే నింటిలోఁ బూరి యిడివిసరక
రాఁజదు; రాఁజిన రవులుకో ల్వాపాలఁ గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూ డగుట మంద్రైనఁ బెన్బాగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తల కెతీఱు బహుజనాన్నము; దీఱ నారులకొదవుఁ బునఃప్రయత్న
మూఖ్యపటముఖ్యలయు మెన్న; రాలయాంగ
దారులయు మెన్న రంతిక; కారజనిక
పచన సాంధోగృహిణి రామిఁ బడుక మరుఁడు
పెసపెసని యార్చ నొగిలి రజ్జడిని గృహులు."

ఉ. కాలువలెల్ల బల్లదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గెలియొనర్పఁగాఁ గడఁగెఁ గేవల మబ్ధి నతండు నీరమూ
ర్తాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాల తొలఁగిరన్ విక్రృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౮౭

ఇందలి యర్థాంతరన్యాసము మహాకవికాళిదాసుని కుమారసంభవములోని
"వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అను
శ్లోకమునుండి గ్రహింపఁబడినది.

కవు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను బద్యభాగాదు
లను దత్తద్భావతత్పరులై యనుకరించుచున్నారు. దానిని వనమస్థలచే జేసిన
గ్రంథచౌర్య మనరాదు.

—। శరదృతువర్ణనము ।—

క. జీవన మంతయు లోకో,జ్జీవనమున కిడుచు గార్యసిద్ధి వడసి పై
కేవలపలితంబుగ దా,బోవదె ఘనపాళి యక్షపుంగవు దిశకున్. ౧౧

ఇందు భారతీయులకు బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము
సూచితము-

—। హేమంతర్తువర్ణనము ।—

ఉ. తర్ములదాయ మేల్పనగ దాళక తర్ములనేచ మించుది
చ్చు న్మరియాద మీఱి వడిజొన్పగ దర్ములతోడ నార్తన
ఖ్యర్మ్యు భరించు కల్వలును గాఱియ జెందెను మిత్రవర్గము
తర్మ్యు నెఱుంగ దయ్యె నుచితస్థితి గాంచ జనుండు నేర్చునే. ౧౦౬

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు నను
భవసిద్ధమైనది.

—। శిశిరర్తువర్ణనము । —

ఉ. శీతముచేత బాధపడు చి త్రజగంబు భరింపగా జగ
త్త్రాత దినేశు డీశ్వరత దాల్చును నంబరమధ్యసీము దా
జాతురినేగుమ న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్నీతము చేసి గావలయు నెమ్మిఘటిల్ల హరించుశీతమున్. ౧౧౬

ఇందలిస్వభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మా
స్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః
త్రిమూర్తిస్తు దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేరికైనను, జెప్పంగాశక్యమాని శీతమహిమల్
నిప్పుల కప్పులకుం దా,దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున- శ్రీకృష్ణుడు ధర్మరాజును వీడ్కొని యర్
జునునితో గలిసి యమునానదీతీరమునకు వేట కేగి యట దపమొనర్చు
చున్న కాళిందిం జూచి యామెను వనపురమునకు దీసికొనిపోయి విహా-

హము చేసికొనిరో యనుకథ సహృదయ హృదయాహ్లాదకములైన రసగంభీరకల్పనావిశేషముగల నూటయిరువది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁబడినది. చిత్తగింపుఁడు.

ఇంద్రప్రస్థవర్ణనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణ ప్రజ్ఞగల యష్టభాషావిశేషము నెట్లు చూపెనో :

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు వ్యత్యయకార్యోపపత్త్యనుగత
మనుస్మృతభవికలాపాయోగసిద్ధంబు శేషోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణనిరూఢంబు సప్తాంగరూపప్రశస్తమహిమ
మైఁ విరాజిల్లు నష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముగఁ గాంచె నచ్యుతుండు.

ధర్మజునిభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూడుఁడు-

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీమపదభక్తి చేకొని నిలిచినాఁడ, నితరము నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప, నీవకా కన్యదేవత నేర్పుగనదు
దురితసంహారజగతి ఖద్యోతు మహిమ, మొనరు నేరీతిఁ దలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యమునఁ గాళిందీతీర కాంతారమును మీమాంసా తర్క వ్యాకరణ చ్ఛందో లంకార భరతశాస్త్రములతోను బ్రాకృత త్రిలింగభాషలతోను నుత్తమ కావ్యంబులతోను శ్లేషించి పోల్చి చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాదబ్రహ్మమును నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలవము.

"పగలు గావించు"నను 155 పద్యములో నప్పగింతలలోఁ బిల్లలు పెద్దలం దున్నగుణము గ్రహియింపవలయును గాని పెద్దలందు దోష మున్నను గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(8) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరససల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగరకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియే కాదు, కేవలశృంగారప్రధానము లగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దనశ్లేషమహిమచేఁ గావ్యములోను శాస్త్రములలోను నాగమములలోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలలోను మూలప్రకృతి (అవిద్య)లోను బరబ్రహ్మములోను బోల్చి చదువరుల డెందములం దనాదిపరమసిద్ధాంతముల నాటును. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితమేమియుర్వా" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛేత్పుత్రా దిచ్ఛేత్పరాజయ" మ్మను దాని భావము గలదు.

"హృదయగ్రంథి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః, తస్మిన్ దృష్టే పరావరే" అను నుపనిషత్సారము నిమిడించెను.

"నేరుపుమీఱ" అను 49వ పద్యములో శృంగారరసము నలు వను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 క్రొమ్ముడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమ కావ్యముం బోలును.

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనాభాతిద్వి
రేఫవైఖరిగలిగి త్రిలింగదేశ, సూక్తియనఁ బొల్పుఁ గస్తూరిచుక్కబొట్టు. 67

ఇందుఁ గస్తురి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చవుతిచందురుఁ జూచిన నీలాపనిందవచ్చును.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యరగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బలిమిని గార్యసిద్ధిని గలిగించు నను నుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం" అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాతి"—ఇందుశబ్దచిత్ర మయిన యమకము.

138 "బ్రహ్మ మనవొప్పు"—అద్వైతసిద్ధాంతము. చూచితిరా శ్లేషమహిమ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 "గరితబింబోష్ఠి"—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై"—282 "సుప్రసాదత"- ఇందు రసావహమైనచో దోషము గూడ గుణమగు ననుకవిభావము తోఁచుచున్నది.

168, 236 గగనకుసుమము-అప్రసిద్ధ మని తార్కికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంతసౌఖ్యముకలుగు నను పౌరాణిక భావము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును బైలుపఱుచువిధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ యిందుఁ గలదు.

228 ఈగద్యమునందు (అహిభయము) స్వపక్షభయము గలరాజురాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మతత్త్వము.

230 భగవంతుఁడు సర్వద్రష్ట.

241 భగవంతునిదర్శనమైనపుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "వెండియుజగజ్జన్మాది" అను పెద్దగద్యమువంటిది. ఒకవిశేషము—అం దర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు, కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామూలాస్పదంబై తనరు."

మొత్తముమీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నక్కడక్కడ నౌచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదళీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంతసంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణతర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగువ్యాఖ్యాన మపేక్షణీయము. ఘనయాంధ్రసాహిత్యపరిషత్తువారు తగినయత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగుదురు గాక! మూలమూలల నున్నయట్టి

మహాగ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను జిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసంపదభివృద్ధులను జగదుపకారకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

గీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
నట్లు దక్షిణావాక్యము లాత్మతృప్తి
నందఁజేసెడు నీకు నారాయణాత్మ
ముదముగన లోకబుధులు ప్రమోదమూప !

ప్రమోదదక్షిణాయనము,
పిఠాపురము,

శ్రీపాద పాపయ్యశాస్త్రి,
శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థాన
పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

— వి ష య సూ చి క — పుటలు.



---

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

### — చతుర్థాశ్వాసము —

క. శ్రీమద్భార్గవరామవి,రామకరస్త్రామధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు,త్రామా సాకేతధామ దశరథరామా. ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

—॥ వసంతర్తువర్ణనము ॥—

క. అంతట విమలక్షీరత, సంతతసుమనఃకదంబసంజీవనతం
బొంతై సురభికి మిక్కిలి, వింతై *యేతెంచె సురభి విరహులు †బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు లై నూనికొనఁగఁ, దలఁచి వనలక్ష్మి జీర్ణచ్ఛదంబు విడిచె
మాధవుని రాక కని వృక్షమండలంబు, దాల్పఁగను బట్టజీర్ణచ్ఛదంబు‡ రాలె.

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే §నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపుల కింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజడిచే నైనయులజడి సహియించు మానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేవయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌమ్యవైశ,మూలకారణ మైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగనయామోదమును బొలంగ

సీ. తనరు దక్షిణజగత్ప్రాణున కేవేళఁ జెడనిమాంద్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రతతి వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడరుకతన
నఖిలనిమ్నాగుల నాయాసపడఁజేయు నీలదేహుల కుక్తి నేర్పుకతన
సురుచిరాకృతి జాతిసుమనోవిలాసంబు గాదవను నాడిగట్టుకొన్నకతన
నప్రసాదత కాటక ట్టైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబుఁ గణిగనుచు, నలుచరియించు నామునివాళిగొనుచు.

చ. అలరులచే జగద్విజయ మందె మరుం డన యుక్తి భూషణం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబు లై
పొలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితి చేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు నటంగ లక్ష్యమా. ౭

---

* యేతెంచె-రా. † బెగడక-రా. ‡ రాలె. § నెగడువాఁడు, [illegible]

మ. ధరఁ బాదంబులు నాటి మ్రాన్పడుచు వంధ్యత్వంబు వోఁగోరి య
త్తరురాజుల్ గడు మాధవుం గొలువఁగాఁ దద్వాంఛ్యతోత్పాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతుల్ ఘటింపించు త
చ్చిర(ర)దత్తారుణమాత్రితాయత లవం గాసంగనయ్యోన్నసల్. ౮.

క. ఫలగర్భిత గాను లతికా, కలకంఠులకుసుమగుచ్ఛకుచవక్షోజం
బుల మిగుల నొప్పు గైకొను, నలికోచిత్యామచూచుకాంచితరోచుల్. ౯

గీ. కుంబురసముసుమనః కదంబకంబు, కాలగతి(?)మపురకాంతలఁజాలఁగూడెఁ
దత్సమూయాతమైనపాతకముకతన, విరిసెఁ గాఁబోలు నన నద్ది విరియుచుండెఁ.

చ. అరయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగులతాలతాంగులయుభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితనినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురవైన యవ్వ్రజినకాళిమ మేనున నంట నభ్రమే. ౧౧

క. గిబికపడి కొనలు సాఁగక, యొఱలులతాంగనలఁ బెనిచి యొప్పఁగఁ బుష్పం
బఱఁ బుష్పమొగ్గగుబ్బలు, వఱల ఫలం బెనంగఁజేసె వలపుఋతు వౌగెఁ.

క. మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగముల్
మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగముల్. ౧౩

క. ముసు వృద్ధికి ఘనులొసఁగిన, ఘనఋణ మొగిఁ దీర్పఁ దరులుకప్రసుమపుటం
బునఁ బొదిగి ఋణముఁ దీర్చెను, గనదళిదంభంబు దాల్చుఘనదూతలకుఁ.

గీ. బంధురము లైనయులవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భావమాకులపాటొదఁబరఁగు*మర్య, కంబునానటమధువ్రజంబుమిగిలె

చ. వరవనమాలికాకలితవాసన లూనుచు మాధవీమనో
హరరుచి కాస్పదం బగుచు నాత్తమహాగముఁడై కుజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవిప్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డపుడు భవ్యఘనాకృతి మాధవాకృతిఁ. ౧౬

గీ. తోగుల ధరించి యరిచక్రయుక్తి మించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తిఁగాంచి
మాధవుఁడుమాధవుఁడగుమదిఁ దలంచు, నలయపాంసులకాగుణం బరుదుగాని

సీ. కంజరగుహాలలోపల నున్నఁ గైకొని శర్కర మెక్కెడుజంతువితతి
పరివృష్టిఁ గోరెడి యుశనంబు గానక గాసిల్లు హానిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వరహంసవారములను
నలయని రక్షించనక్కడఁ బ్రావృషు వనీయించు చేతనవ్రాతములను

సత్పరిగ్రహాలాభంబు సంభవిల్ల, సుకృతరామోద మందెను యోగితతుల
మన్ననయొనర్చెఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబు లెవ్వారికాఁగనిచ్చి.

గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితానందితమాధుర్య మధికతప్ర
సాదమై యొప్పెన పుంవసంతఋతువు, మహితకావ్యప్రకాశకృత్సమయమోలె.

క. పల్లవపేశలశయ్యా, వేల్లత్క్రీడలకుఁ దనసి విమలధ్వనులం
బెల్లెసయుచుఁ బుంస్కోకిల, తల్లజములు వసంతవేళఁ దనరెన్ మిగులన్. ౧౦

చ. తెలిపువునీటివర్షము లుదీర్ణములై యొనరంగ వస్రేఁన్
మలయఁగఁజొచ్చెఁ బుష్పితకుమారము లెల్లెసల న్నిరంతరా
కలనవహించి దట్టముగ కానఁగనయ్యెను యోగదూరతం
గలఁగెను దంపతిప్రతతి గాంచుము హాత్మపుఁ బాన్పు గొప్పలున్. ౧౧

సీ. ఉవిదపుక్కిట సుర యుమిసిన నొక్కఁ డతకుప్ర పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుమ వ్రాసిన నామోదసంపద నంది వెలయ
ముద్దుల నగవుల మురిపెంపుఁ బాటనుఁ గౌఁగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నసుగుట నూర్పుట హస్తసంస్పర్శనఁ గొన్నమహీజముల్ చెన్నుగొనియె
నవనియందు నచేతనతామహీజ, గవినప్రాకు నిక్కామినీకుటీకగార
వావమానంబులొకటిగా నరసిచూడ, లలనచెంత యశోకావింత యతివపొంత.

గీ. చెలువుమీఱినయత్వేళఁ జిత్రముగను, నిమ్మి గైకొని మెలఁగెను నిమ్మకొదలు
నెపుడుఁ బాయని నైజాత్యమిరవుగొన్న, యట్టినయ్యది సాజాత్య మాశ్రయించె.

సీ. అరసానుభూతుల నరసానుభూతులై మెలఁగుచుండఁగఁ జేయు మేలుశక్తి
లేఁగొమ్మపొంకులు లేకయుండెడు వానిఁ దద్వృత్తనందింపఁ దనరునేర్పు
బ్రతివానసలేక బడలుచుండెడు వానిఁ బ్రతివాప్తినలరించు ప్రబలమహిమ
పల్లు లింపులు మీఱఁ బలుకనేరని వానిఁ బలుకదిద్దినయట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁ గనుము దమున, ననయఁ జేయువసంతయోగీంద్రుఁ గన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లు వత్తిల్లకుండునె పల్లటములు.

క. సురభీరయమార్గచరా, స్థిరమాశన సమ్మదస్రుతే ర్భవతి కుహూ
పరిహార్తా నే త్యేవం, పరవాక్కుల నవిరళముగఁ బలుకుం బికముల్.(?) ౧౨

ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందకలాపవాసనై
యంకురసూచికావినిహతాహితమండలజీవితంబునై
శంకిలఁజేయు వాధరతశాస్త్రము నామని దానిఁజూడఁగా
నంకురమూను మోదభర మవ్వనిరీక్షణఁ గల్గ నేర్చునే. ౧౩

## — గ్రీష్మఋతువర్ణనము —

క. అంతట వేసవి దోఁచెఁ ద, రంతమహోష్మానుగతనిరంతరమిథ్యే
దంతాభ్యర్హితమతదృ, ష్టాంతమరీచీనిమీలితాశాంతంబై. ౨౮

క. వరసుమనోజీవిత మగు, సురభిం బెంపంగ భువనశోషకతిగ్మా
కరసనుజుఁడు వడిగఁ దదా, కరవిపినంబులనుమిగులఁ గాఁక దహించెన్. ౨౯

క. ఆమొద దక్షిణదిగ్భవ, వాయుపదత్రయికి నెన్న వరుణాలయది
గ్వాయువు సపాదసప్త, ధ్యాయయనం దగు నటంచు నడరు న్మదువుల్.

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖశాఖల వనుల ధ్వాంతారాతి డాపంగనో
యతిశోషోగ్రత వర్వసంతు వయిఁ దా నందెం జుమీ నాఁ బదా
హతి దూరోష్మత లోకశాంధవునియం దాహూఢమై వర్తిలెన్. ౩౦

మ. నతవాహంబులు మచ్చరం బొదవఁగా సప్తాశ్వము న్వేట న
ప్రతిమం బౌ రథమూాన వంతిడఁగ నా భావంబుచే శీఘ్రపుం
గతి నయ్యాశ్వము గాంచలేమి జడిమం గాంచెం బ్రయాణంబు భా
వతికిన్ నా దివసంబు లాతురము లై పాటిల్లె నవ్వేసవిన్. ౩౧

సీ. నాదగు దాహగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్ప్రాణువాహ
నశక్తిసంపత్తికి సంశయింపఁ బనేమి నీమఁ డొక్కఁడు గంధనిలయగోత్ర
మందితద్ధర్మంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ విడుతు నెట్లు
జడత నైకొనుట నే జలముతో మైత్రికిఁ జొరఁజెచ్చు హారియింతు శరధిఁ జొచ్చి
యనుచుఁ బశ్చిమజలనిధియందు మెలఁగు, భీకరాటోపబడబాగ్ని వెడలె ననఁగ
నఖిలజనములు భీతి నిట్టట్టు గాఁగఁ, బట్టుచాలక వడముటి వెట్టె దోఁచె. ౩౨

క. పుడమి విచెయంగఁ గొలుకుల, తడి కొలఁకులతములతోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్లగాళ్లం, బడి గొంతులు నసుపు మ్రాద్రు(?)పడమరసాగెన్. ౩౩

సీ. బలిసెను బహుదూరపదవి ప్రపలతోడ భూరినిరి న్యధ్యపులినవితతి
కొండపాగెను మార్గగేహితకూపంబు లమితపాంథాళికంఠములతోడ
దీర్ఘత నైకొన దినములు మతిమతి యతిపృథజలరజ్జుతతులతోడ
మించెను మిత్రోపలాంచదగ్నిశిఖాళి చటులదవానలచ్ఛటలతోడ
వంతకాష్ఠప్రదాతకు సాధుకర్మ, శీలునకు నీళ్ల వలవలు సేయవలసె
పతులవకువృద్ధి గలిగిన ఋట్టినాని, కైన నర్ధాంబు వబ్బుట యరిదియయ్యె.

గీ. కూటిపేదటికంబు గైకొనిరి మిగుల, నాతురము చేత బ్రతికినట్టివారు
ఖననమొనరించితనుయాత్ర గడుపువారు, కూలిగలుగుటనవ్వేళ గూటఁబడిరి

గీ. తల్లి *పదమునందు ధార్మికమనముల, (సుకవి)కవితయందు సొబగుమిగులు
గుబ్బలాంధ్ర పీనకుచమధ్యసీమల, నిలుచు శైత్య మనుచు నిలుచు బుద్ధి.

క. కూటివిధి పానముం దెను, బాటిల్లెను నీళ్ళకుళ్ళు పవనంబునకున్
మేటిసురతములకూరిమి, గాటపుటుక్కూహానములఁ గదలక నిలిచెన్. ౩౭

గీ. చూడకయుఁ జూచికొన్నింటిపీకనాకి, యుదసియొకకొన్నికూపంబులాఁగికొను
చుఁ, బురుషులింతులు వేర్వేఱ బురదనీరు, కడవవలితిగఁ గైకొనికడుబడలిరి.

క. హరఘాతోద్ధతవహ్నియొ, తిరుగం గ్రాఁచుగఁ దలఁచి దీపించె నటం
చురవడి వెట్టకు వెఱచుచు, మరుఁ డురుకుచశిశిరదుర్గమధ్యముఁ జేరెన్.

క. బలుబీటలవెంబడిఁ జనఁ, గల (జల)జంతువులు మొనటఁగల పదనంబుల్
జెలువబలుగుబ్బ చలువల, నెలవుగఁ గైకొను మగండు నేర్పున బ్రతికెన్.

సీ. ఇనుఁడు దాక్షిణ్యంబు వినసి ముల్లోకభాంధవుఁడనఁదగి యుద్ధతకరత్వ
మెచ్చుపుగఁ దనకు జీవనసిద్ధి గావిరఁ దమలోనిజాతుసంతతులకోడ
ముదము గైకొన నదీనదము లంతటఁ గాలగతిచేత నత్యుగ్రకరతఁ బూని
యతఁడు దాక్షిణ్యంబు గతముగా దినదినంబును నాత్మదత్తజీవనము నెల్ల
గాఁకఁ గైకొన జంతులాఁకటికి లేక, మలమలనుమాఁడఁ బన్నతగలయుఁగ్రమ్మ
నదయుల్లంఘనము సేయునదితఁడంక, భావ మొదవంగ నెంతయు బయటఁబడియె.

క. పట్టపగ లెనకుభానుఁడు, శెట్టగు కాఁకల జగంబు బెదరింపఁ బాయం
దట్టిమొడఁ గాన సెకక, న్దట్టపుజగి మొఱపెనసెనుతలఁ బువుఁ ముంచెన్. ౪౨

గీ. పవలధఃకృతకేధభావప్రచండ, ఘటనకటువృత్తి దీక్షతాచటుల మగుచు
దివ్యతేజోగుణంబున దీప్తిగాంచి, సుఃవిశ్వతిరీతిఁగనవయ్యెఁ జూవరులకు.

క. పడమటిసెక మదుకఁగఁబడు, పిడికిటివస్త్రంబు తల్లబెట్టాటంగాఁ
గుడికరమునందు నిలిపి, కను బూతం బరుచు వానిఁ గర్మాయాస్యల్. ౪౪

గీ. చిత్రచిత్రరుదివ్యాప్తిఁ జెంది యరస, భావనిత్యాస్పదంబని పలుకఁ దగుచు
భీకరనిదాఘసమయంబు పెంపుగొనియె, జరమకావ్యంబుగొన్న సౌష్ఠవముగాంచి

క. పంకరుహాజాండభాండము, పంకజహితదీప్తకాంతి పటువహ్నిశిఖా
శాంకమలి గ్రాఁగుచటివి, రంకుశధూమంబనం బరాగము పొదవెన్. ౪౬

---

*పదమునన్ను. పా.

సీ. చంచలారోచిర్వైశ్వానరశిఖ లొప్పఁ జిత్రధనుర్లతాస్ఫీతు లెనయ
మేదురగర్జానినాదంబు లెసఁగంగఁ గరకామహోపలగతులు మిగుల
నాశుగోద్ధతవృష్టు లవిరళంబులుగాఁగ వాఁగోపకృత్పతాపార్చు లడర
వాహిను లెంతేని వడి మించి నిగుడంగ వళిసఘోరాస్త్రవిహార మొనయ
వలమయూరాదికవివరు లతిముదమున, ఘనతరస్తుతులొనరింపఁగా ఘనకంబు
అఖిలసంతాపకారి గ్రీష్మాపకారి, కడక మాయించె సర్వోపకారి యగుచు.

క. *వార్షికమహాభ్రకటలా, కర్షణపటుమంత్రవిద్య ఖరఖరఖరతా
ధర్షణకారణ మగులే, ఖర్షభదిగ్వాయు వపుడు కడు దీపించెన్. ౫౯

చ. పడమటిగాలి దా జగముప్రాణము నగ్రకయుంతు గాంచునే
వెడఁ గగులోకబాంధవత వేదనసేయు నటంచు రోయుచుం
గడు నల(రె)గా బలారిదెసగాడ్పు వదాన్యఘనుండు దోఁచఁగా
నడువ జగంబుప్రాణ మనునామము లోకములో విరాజిలెన్. ౬౦

క. జలధిం జలుకంబునఁ గొను, బలు సర్పరి కుంభయోనిఁ బ్రార్థింపుచుఁ ద
జ్జలముఁ గొను †సర్పు గన నన, జలదంబులు జనుసతోడఁ జాయకు నడచెన్

గీ. పగలు రేయి దివాకరుఁ బద్ధవైరిఁ, బొడివి పిత్తింపఁ గను విరహిదళనంబ
నేమమునఁ జేయఁబూనుచు నగడమింట, విపులతరమైన(యూకృష్ణ)విషధరంబు

క. ధారాధరగళనురురస, ధారానిర్ఝరమునంకుఁ దత్రేష్జలకుఁగా
దూరించెను సమవిమమా, కారజ్ఞానములు రూపకం బొక్కటిగాన్. ౬౩

క. స్థలజలభేదము మానఁగ, జలదము వర్షం బహర్నిశంబు ఘటించెన్
విలసల్లక్షణవృత్తికి, బలుశాబ్దికు లాత్మవృత్తి ప్రతిసేయంగన్. ౬౪

ఉ. అందముగాంచు నట్టిదవరాండ్రు బెండిలియాడుచో మదిం
జెందు కలంకతో వడిగఁ జేరు స్రవంతివధూటుల న్నిజా
మందతరంగహస్తముల మంచి నెదుర్కొని కౌఁగిలింపుచుం
డాదములోని యక్కలఁక దీర్చు దక్షిణవార్ధి నిత్యమున్. ౬౫

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానరరక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగిక్షైసను రాత్రి భోజనం బెచ్చట నన్నమాత్రముకాని యబ్బదయ్యె
పౌరమంత్రోపాస్తిచతురుల కెకసంబు వార్తగల్గుట గాని వావియయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింక(బ్రార్థింప)శిఖ రొంకింతొసఁగిసఁ జిత్రమయ్యె

* వర్షక—మూ. † కొర్పుగజశన—మూ.

జంబుగూడలకలుములు దంబుమిగిలెఁ, గలకసంపాదనంబులు ఘనతగాంచె
నన్నదాతకు ననియు నతిథికోకనిఁ, గైన నన్నంబు గలదను టరిది యయ్యె.

మ. చటులోద్యద్ఘనగర్జితధ్వనులు చంచచ్చాంచలారోచు లు
ద్భటవృత్తిం ఘటియిల్ల భీతి మదిఁ గోఁకం భీరురంభోరువుల్
వటుమానంబులు మాని తమ్ము బలుకుబ్బల్ గాఢసంఘర్షఁ జ
క్కటనాసట్లుగఁ గౌఁగిలింప రమణుల్ ప్రాపింతు రానందమున్. ౧౯

సీ. భూప్రజానంతాపభూరిదైన్యావరజ్వాలతోఁ దావాగ్నికీల యడఁగె
నూర్జితమేదురగర్జితార్భటులతోఁ గందళీసంపదల్ గ్రమ్మకొనియె
నవిరళశరాసాంకురారూఢరుచులతోఁ గోక్షీరకుచులు పొంగులువహించెఁ
గర్షకపాదజాఘండమోదంబుతోఁ గానరామోదంబు వాసిగాంచె
జాతికుసుమ(జ)పరిమళభాతి కేకి, జాతికేకారవంబుతోఁ జాలనగెఁ
జాతకవ్రాతమదతిమిరములతోడఁ, గలయ దిక్కులఁ గటికచీఁకటులు బలిసె.

గీ. దినదినంబును శుచికాన్తతేజ మిచ్చి, మగుడఁగైకొన రోఁతనిమానసేమొ
తరణికిరణంబులన్నియుఁ బరఁగనేమొ, ఘనములగుచును గాకున్న నినునిగనరె

చ జలధిమథింపఁగాఁ బొడమెఁ జంద్రమయం బగు సుర్వముద్ద దా
బలుఘనమండలంబు వడిఁబర్వఁగఁ జేయు మహాంబుధారలోఁ
గలియుచు నీరమయ్యె నని గట్టిగఁదోఁచెను బుద్ధికానిచో
జలదహావైరి సత్తిఁ బ్రజల్ గనరేల సుధాకప్పు డేనియున్. ౨౦

క. నిష్టసులలోన నాదిమ, నిర్జరుఁ డగునీటిచూలి నిరతస్ఫురితా
త్మార్జితసృష్టి న(ని)ర్జర, తార్జితదుష్టి ర్తియయ్యె నని ప్రజ నుదువున్. ౨౧

గీ. ఆటవెలఁది యనఁగ నమరెను దద్వృష్టి, యురుపయోధరత్వమిరవుగానుచు
శ్యామభావ మొదవ నంతతమన్మథ, వికృతిమహిమ కెల్ల వితనంగ. ౨౨

గీ. ఉరుతరంబగువృష్టిసూర్యోదయాస్త
మయము లెంతేనినందిగ్ధమయిన యపుడు
సోమపుంశకగ్నిఁ బ్రణయించుచోట నాదవు
ననమయూయత్తసృష్టితియహారహంబు. ౨౩

గీ. అఖిల మమ్మతు మగునట్టు లాచరించి, ముప్పాలంగు విలాసంబుమంచికాన
యద్వితీయతఁగైకొని యభ్రపటల, మాదిమబ్రహ్మ మన విస్మయంబొసంగె.

క. భూరిప్రసాదమధురిమ, ధారాగుణ(ము)ల నంతతస్ఫురదోజ
స్సారముల నభ్రమండలి, గారించు న్ననవరతప్రకారపుఁ గవికిన్. ౭౫

ఉ. జీవనమున్ హరించి యును, జెల్వివిఁ బాపియు, జన్యకోటికిం
గేవలహానిఁ జేసియును, గేరు నిరుం డరుగన్ ఘనుం డా
జీవనవృద్ధి గైకొనుచుఁ జెల్వివిఁ గూడను జన్యసంతతుల్
ఠీవి వహింప రాజు నటిష్ఠతఁ గాంచె నదీవిలాసినుల్. ౭౬

గీ. నటఘనాఘనమండలి ప్రసరదసమ
వర్షధారానిరస్తసంజ్వరత గాంచఁ
జాతకా(ము)త్తగ్గుణముఁ జెందు జగమునందు
విమలభావంబు గైకొను విస్ఫుటముగ. ౭౭

క. నవరసబంధుర మేనియు, నవిరళకస్తూరికటుకవాన్విత మయ్యెన్
*అవగతరసావకర్షం, బవునే యుశ్స్పృష్టరసనుహత్త్వంబు మిగుల్. ౭౮

క. ఘనమండలి యత్యున్నతి, గనుఁ†దొల్తం బిదపఁ గరకకలితకుసుమజా
లనవజలసేకములఁ దా, మొనయుం పుడమి నీలకంఠముద మొనరించున్. ౭౯

చ. సరసఘనాసమంగమున నంతతతాపము మాని భూమి దు
ర్భరతరపంకమగ్నతనుఁ బాల్పడి మొం బొరింప నద్ది యే
కరము నిదానమా జగదఖండసుఖంబున కాదిమూలమై
పరఁగు నపారసాధుఫలభారసమృద్ధిఁ జిత్రమెంతయున్. ౮౦

చ. కడమటి వెట్టచేఁ గను కథంగురవేదన గాంచఁ జూచి తాఁ
జికిము(పా)కుమై నిమురఁ జెందక నందకపాణి యవ్వ డా
కము సెకపే రవంగఁ దవకాన్ని సుఖంపఁగ రెండుకన్నులున్
బవలిఁ దీటి చెయ్యెగొన వారిధిఁ గూర్చు ఫణీంద్రకయ్యకై. ౮౧

క. ఉరుగర్జిత వాద్యధ్వని, సురుచిరకేకానినాదసుధ(గీ)తంబుం
దరుణమయూరీనృత్యము, వరఁగ న్నాట్యంబు మిగుల భాసిలుచుండున్. ౮౨

గీ. ఘనతగర్జైజగ ద్రథకత జనత్వ
మూర్ధ్ని తేఘటిల్లెఁ గావున నచట భత్వ
ముత్వపరమార్థముచితమన్న యొఱపుమీఱఁ
బొదలివర్షాభువులు చాల రొదలు సేయు. ౮౩

సీ. నిర్ఘాతగర్జితనిరుపమకోపప్రసాదవిహార్ణోక్తులు చాలఁదొలుత
విద్యున్నటీలాస్యవిలసనంబులుమీఱ నాసారకారుణ్య మతిశయిల్లఁ

*అవితరసావకర్షం-మూ. †దొల్తటిపిదప-మూ. ‡ఉదిత కస్తూరీ-మూ.

జాతకబర్హిణచతురార్థు లలరంగ జాతు లానూనవిస్తార మొనయ
ఫలహేతుధర్మసంధరణశక్తి చెలంగ సంతాపవార్తలు శాంతిగొనఁగ
రాజహంసవిలాసంబు రాణఁదొలఁగ, సమతవర్తిల్లు చున్నతస్థాన మొనసి
ధరణిపాలించు ఘనుఁడుచిత్రంబుగాఁగఁ, బాక మొక్కటి యొక్కువైవరఁగెఁగని
గీ. మానకృతమైనవిరహంబుఁ బూనన య్యెఁ, దరళనయనల కవ్వేళ ధరణిఁగోన
ఘనకనంపాదితద్రవ్యగౌరవంబు, సాధికరణంబు కర్ణధారాళి నయ్యె. ౪౫
క. కట్టువడ నటికాల్నద, బెట్టగువర్షములఁ గొనను బేరముతోడన్
మిట్టమిట్టాటుపల్లెలు, గట్టిగ మునచూపసాగెఁ గట్టులతోడన్. ౪౬
ఉ. కాలువలెల్ల బల్నదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలి యొనర్పఁగాఁగడఁగెఁ గేవలమబ్ధి నతంపు నీరమూ
త్రాలయుఁడైనఁ దావిక్రృతినందక యుంచు వికారహేతువుల్
చాలమెలంగినన్ విక్రృతినొంగఁదిఁ గాంచున ధీరచిత్తముల్. ౪౭
—। శరదృతువర్ణనము ।—
క. తరువాత శరత్సమయం, బరుసుగ ఘటిముల్లె నంబుజాక్షుస్వాపా
వరనామకబహిరంగము, హరియించఁగఁజాలు నంతరంగం బనఁగన్. ౪౮
గీ. వారివాహారసారంగవర్ధమాన, బహుళదీర్ఘకబాహుళ్యపాటనక్రి
యాతిదక్షిణరామనామాభిరాము, మై శరత్కాల మామోదములరనమరె. ౪౯
సీ. కాలవశాగతఘననీలతా స్థాయిభావభిన్నాదేశభద్రమూర్తి
సర్వసరిస్నీరసంపదసచ్ఛతాద్విగాన్వాల్మీకిదివ్యసూక్తి(?)
రుచిరకేకివచోవిరుద్ధధిక్కృద్ధోషసమునఃభిన్నైకసంశ్రయంబు(?)
సరసిజాహితబింబసత్కావ్యశోభాతిశయహేతుహితపరిష్కారమహిమ
మూర్జితహరిప్రబోధగురూనదేశ, మఖిలహంసగణాకర్షణాఢ్యమంత్ర
మంబుజాతప్రభావ్యంజితాంజనంబు, దనరె నెంతయు శరదభిధానఋతువు.
క. సరసతకల్మిఁ బ్రసాద, స్ఫురణంబున నదులుమెలఁగఁ జోద్యంబగునే
విరసితభావము నందియు, నరుదారఁ బ్రసన్నభావ మందె వరుడుగరా. ౫౦
క. కలుమతఁ గడపెనుశరదృతు, వాలయఁగ సుఖపారవశ్య మొదువ న్నదికాం
తలపులినకటితటంబుల, నలరారఁగఁ బూని రమలహంసకగణముల్. ౫౧
గీ. అలకశాఖాను నలరించి యవనిపంక, కటిమ వారించి యుద్యోగిబంధ మెడపి
శరము విడువక యాశరత్సమయ మొనయు, నటికోటులకలుష తమిగా చెనుటయు.

## — హేమంతఋతువర్ణనము —

క. సర్వజగద్వీక్షణా, ఖర్వనిదానాబ్జమిత్రఘనరుచివిద్యా
సర్వస్వహార్యవిద్యా, ధూర్వహమై మించుమంచు దూకొనె బిదపన్. ౧౦౫

ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచుది
చ్చు మ్మరియాదమీఱి పడిఁ జొప్పఁగఁ దమ్ములతోడ నాత్మ న
య్యమ్ముధరించు కల్వలును గాఱియఁ జెందెను మిత్రవర్గమూ
తమ్ము నెఱుంగఁడయ్యె నుచితస్థితిఁ గాంచ జనంబు నేర్చునే. ౧౦౬

క. అహహాకారతఁ *గైకొన, మిహికాసముదాయంబునందు మిగుల నగనుచున్
మిహికాసముదయ మంతట, రహి†సంసృతియనఁగ‡వింత వ్రాయఁగనగునే.

ఉ. నింగిముట్టి తోడుతన నీటుతొలంచెను వింధ్యశైలముం
జెంగఁగఁజేయ మంచుమల చిత్రముగా వడి రోదసుల్ గనుం
బొంగుచుఁ గ్రమ్మనో యనెడుబుద్ధి జగంబుల కావహిల్లఁగా
భంగము లేక యెల్లెడలఁ బర్వె హిమాని నిరంతరంబుగన్. ౧౦౭

క. మంచు గిరితరుల ముంచఁగ, వంచకభిల్లుండు వెదకు వలిపులతోన్
ఎంచుకొనఁగఁడఁగి రమరు లు,దంచితనిజనిలయనివసదామరతరులన్. ౧౦౮

క. అరూఢహిమ మడంపఁగ, నేరుపు గానఁడయ్యె నినుఁడు నెఱిఁబగటను నీ
'హారమివభాస్వరఇతి', స్ఫారోపమ యొనర మిగుల జతనంపడియెన్

క. పదవర్ణస్ఫోటంబులు, గదియింపుచు ముఖకదముల ఘటియించఁ గడుం
బదిలముగ ధ్వనులు శాబ్దిక, భిదురధరస్ఫూర్తి హిమము పెంపుమిగులఁగన్.

గీ. ముఖకదోచ్ఛ్రయమున ధ్వనుల్ మొనయఁజేయఁ
జాల నెనయించు రూపకమీలనముల
హిమకవి యొనర్చుదృష్టాంతకములఁగరిమ
సమజగత్కృతియధరవ్రణములుగాని. ౧౧౨

## — శిశిరఋతువర్ణనము. —

గీ. దాఁకిపిమ్మట మార్తాండభానుచండ, భావసంస్తంభనామధప్రాభవంబు
సంగతమసంతికాదృఢాలింగనైక, ఘటనచేటంబు నగుశీతకాల మొదవె.

చ. చలి యిడుమేదనం బడఁగఁజాలక పద్మజకోకశంకరుల్
మెలఁతల నావనాబ్జమున మించుసరంబున సామిమేనున

*గైకొని. †సంసృతి-‡వింతరాయఁడనుకే మూ.

న్నిలుపుచు నవ్వాతం గడవ నేటికిఁ బాయరు తత్ప్రదేశముల్
జెలువలు గారవం బరుగఁ జేయఁగ న*ద్దళకోర్వ నేర్తురే. ౧౧౪

గీ. అగ్నిదివసాంతసమయవివ్యస్తమిహిర, వటుమహఃపూరసంపూర్ణబలుఁడుగాన
సంతతాత్మీయకేవలసన్నిధాన, కలన శీతంబు వారించుఁగా యొకింత.

ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్త్రాత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిను
న్నీతము చేసెఁ గావలయు నిమ్మి ఘటిల్ల హరించు శీతమున్. ౧౧౫

క. కాంతభృశాలింగితధృత, కాంతాకుచకుంభమధ్యగతసూక్ష్మబిలాం
భ్యంతరము గని యనఁగత, కాంతయు నలుకచును మదనుఁ డడయుం జలిలిన్

చ. అరమొయినుండు నద్రిసుత యందపుఁగౌఁగిలి లేక చిచ్చుక
న్నర కడు శీతలింపఁ జెలి కడ్డము సేసెరు గ తనాళము
ర్భరగరవహ్ని మంచుమలరాయని యల్లుఁడు దేటచందమా
మరసిగలో విషాశిఖరమా బలుకొంపలి లోఁగఁగట్టుచున్. ౧౧౭

క. †చలికిన్లోఁగక నిలిచిరి, వలివెలుఁగులు విదలుచల్లువాఁ డొక్కరుఁడున్
విలసత్కాలాగరువౌ, వలిచుబ్బల నండగొన్నవాఁ డొక్కరుఁడున్. ౧౧౮

క. అప్పుప్ప యేరికైనఁ, జెప్పంగా శక్యమాన శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యాన్యోన్యసదృశతను ఘటియించున్.

గీ. మూర్తికౌటిల్య మెంతేని మొనయఁ జేయు, నధరశబ్దప్రచారంబులఁ జరఁ జేయు
శీతలరసాతిదూరతఁ జెందఁ జేయు, శిశిరకాలంబు దలఁప విచిత్రమయ్యె.

శా. ఈరీతిన్ ఋతువుల్ విరాజిలఁగ నయ్యోగాత్ముఁ డద్వైతతా
కారధ్యానరసానుభూతి ఘటితాఖండప్రమోదప్రవా
హారజ్యన్నిజవృత్తియౌచు హృదయం బవ్యక్తయాజ్ఞానమా
ధ్యాయాథం బయి యొప్ప నక్షజపునిష్ఠం బూని యుండెం గడున్. ౧౨౨

క. జగదండమండనోజ్జ్వల, భగవత్పదవాచ్యనామ ప్రణముజ్జనతా
సుగమ నిగమాంతమానస, ఖగరాజ రథితనూజకల్పమహీజా. ౧౨౩

గద్య. ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపాసాదిత కళాతూసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధి రాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవవన్నయభట్టా
రక అహోబలశాస్త్ర్యాహ్వయకవి మహోపాధ్యాయభట్టారకప్రణీతంబై
న కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

*వద్దన-మూ. †చలికిలోఁబడక నిలిచిరి-మూ.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## — పంచమాశ్వాసము. —

---

క. శ్రీపార్వతీసతీపతి, చాపవిలోపనపటిష్ఠ జలదాభలస
ద్రూపక జగత్ప్రదీపక, భూపకవరసార్వభౌమ పురుషలలామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

### —♦ కృష్ణుఁడు ధర్మరాజుం జూడఁబోవుట ♦—

చ. జగములఁ బ్రోవఁగా మనుజజన్మముఁ జెందు పురాణపూరుషుం
డగణితభక్తి సత్యకసుతాదికయాదవు లంటికొల్వఁగాఁ
దగిలినప్రేమచేఁ దరలెఁ దన్నొకపెన్నిధిగాఁగ నెన్నుచున్
మిగిలెడుభక్తిచేఁ దలఁచుమేటి యమాత్మజు సానుజుం గనన్. 3

క. ఇంద్రారివైరి చనుచు మ, హేంద్రప్రస్థంబుచూచె నింద్రమహీభృ
త్సాంద్రసుమవిసరవిగళద, తంద్రమరందైకపూరితస్ఫుటసరసిన్. ౪

సీ. సర్వభాషావచస్సంనిధానంబు, సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు, వ్యత్యయకారోద్యపవత్యనుగత
మనుస్మృతధవిక్లాపయోగసిద్ధంబు, శేషోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రమాణనిరూపణంబు, సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు షష్ఠభాషావిశేష, సముదయస్ఫూర్తి నాసియుండఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముఁ గాంచె నచ్యుతుండు.

గీ. అపుడు శ్రుతులకు నెప్పుడు నబ్బఁబోని
యనఘవాణమహాపీఠసబ్బుగాని
సవినసంప్రాప్తి యతిథివైభవము గాంచె
సుభగమహిమంపుసమవర్తిసుతుశ్రుతులకు. ౫

గీ. వెన్నునాగమనంబుఁ దా విన్నయపుడ, ధర్మతనయుఁ డెదుర్కొనఁ దరలఁబనిచె
భువనరాకంద మగుతనమునసుతోడ, దానవసుతాదిహితుల సేనాసహితుఁడు.

ఉ. శౌరిమిమీఱఁ దన్నెదురుకోఁ బవనాత్మజు నాత్మపక్షముం
జేరుపుణ్యములఁ జేరిచి నమస్కృతోత్తమాంగుఁడై

ధీకుల నింద్రవంద్యుని దేవభిషక్తనుజన్ములన్ శుభా
ధారవచస్సుధం జిలికి ధన్యులఁ జేయుచు నేగి యంతటన్. ౮

మ. ఒకచో మాధురిఁ గుల్కుపల్కుగములం బింపొందఁగ వేదోక్తచోఁ
బ్రకటప్రౌఢవచోవిగుంభనలఁ దీవ్రస్ఫూర్తివర్తిల్ల నే
కకదోషంబును లేక కావ్యమణి జోకం గాంచు నాస్థానిలో
వికచన్యాయకరత్నమై యనుపమశ్రీఁ గాంతు నీక్షింపుచున్. ౯

చ. నతు లొనరించు పుణ్యుల కపారతసౌఖ్యవిధానదక్షమా
గతి ఘటియించు మనప్పరమకారణతత్త్వము ధర్మమూర్తికి
న్నతి యొనరించెఁ బ్రాక్స్వజనినమ్మున సంప్రతి తన్నిరంతరో
న్నతి కగుఁ గారణం బని జనప్రకరంబు నుతుల్ ఘటింపఁగన్. ౧౦

క. చాఁగిలి మ్రొక్కి నయప్పర, యోగీశ్వరు గ్రుచ్చి యెత్తి యోగీశహృదా
భోగసమనిజభుజాంతర, యోగింగా ధర్మతనయుఁ డొనరించెఁ గడున్. ౧౧

మ. అలవేదాంతసరస్వతీసముపగూహం బేపు గైకొని య
బ్బలుతేజంబు తనంతఁదాన నిజదోర్బంధంబునం జిక్కెను
త్కలితానందపయోధిఁ దేలుచు నజాతద్వేషి నన్నోపఁబు
ణ్యులు లేరంచు మదిన్ గణింపుచు నకేణ్యున్ జూఁచి బల్కెం దగన్. ౧౨

గీ. జనజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకు పదభక్తి చేకొని నిలిచివాఁడ, నితరము నెఱుఁగఁడ యిట నీవె సాటి.

ఉ. అట్టిఁడి వాఁడ నే నెఱుల నంతటి నాతికవాప్తకామునిన్
గట్టిగఁ గొన్న నీకు శుభకల్పన సేసెద నారకుండఁగాఁ
గిట్టను గాన నా కివి(?) గేరక కుష్ఠుల గ్రుంది శిష్టునన్
దిట్టముగాఁగఁ బ్రోచితి నను దేవర వై జగ మేలు మంచు నాఁగన్. ౧౪

ఉ. లెక్కకు మిక్కు జన్మముల లేఁతకుఁ దక్కి సభక్తి నే నతుల్
మిక్కిలి నీకొనర్చితి సమిద్ధగుణాకర తత్ఫలంబులై
దక్కెను * వాయునమ్రతయుఁ బావకనమ్రతయున్ సబాంధవన్
నిక్కము ధిక్కరించితిని నిస్తులపుణ్యయశస్సమృద్ధులన్. ౧౫

గీ. తమము పారియించి వస్తుతత్త్వంబుఁ దెలుప
నీవ కా కన్యదేవత నెఱుఁగనను
దురితసంహార జగతి ఖద్యోతు మహిమ
యొనరు నేరీతిఁ దలఁప ఖద్యోతమునకు. ౧౬

* పాదనమ్రత యని యు-పా.

౫. ఇట్లు దినకాశీర్వాదవరచనాపురస్సరనిరవద్య ద్విపదహృద్యకావ్యశతంబుల క్ర
మంబున నంబులు పూరించుచు సదాచితరోమాంచకంచుకితసర్వాంగుండై
సర్వమంగళాయతనవిజాంగసంగసంగతాభంగురసుఖం బెట్టకేలకు వదలి
యమునతోఁ బుట్టువుగాఁ గాలుంబట్టి వేల్పుఁగొట్టు దిట్టఁ పుటానమం బె
ట్టెడు నంతఁ దధివసించి బ్రహ్మాండభూగోళజంబూద్వీపభూపాలపురహరిప్రస్థప
న్నిలయకలసభాతల్పింహాసనాగ్రమోత్తరోత్తరోత్కర్షనిశ్చర్షతల్ప్రమ లగు
తత్రత్యకవులవాగ్విసారంబులు నసారంబులై వెలయ నుత్తరోత్తరసూక్తు
లం దత్కృపాప్రశ్నప్రయత్నంబు నఫలంబుగా ననుగ్రహించి సహభోజన
సహశయ్యాసహాసనసహసంభాషణాదిక్రియల యమునాత్మజ సానుజుం గృ
తార్థుం గావించె నిట్లు కతిపయదివసంబులు గడువ నంతట నొక్కదివసంబు
న దివసేశ్వరునిమనుమనిమనుమతంబున మృగయావిహారవిలాసనమాలింగి
తాంతఃకరణుండై సత్యభామారమణుండు సత్యకాపత్యప్రముఖయాదవ
వీరులు చేరికొల్వ బలారినందనుం దనుసరింప గుణవృద్ధిసమాశ్రయత్వం
బున సనాదేశవిషయకనిక్షేపత్యాహారవర్ణనవర్ణిత మెఱయు శూరాగ్రసరు
లగ్రసరులై ననుదేర సమానశబ్దప్రతిషేధ నిష్ఠాధారత “నిష్ఠానుజ్ఞాయాం
సమానశబ్దప్రతిషేధ” ఇతివార్తికోక్తి ననుసరింపుచు దద్గుణవిషయతం గృ
తసర్వాదినిపాతనతవహించుట సర్వప్రాతిపదికంబు ననుహసింపుచు(?) ద్వితీ
యప్రక్రమ ద్వితీయక కవర్గచతుర్థవర్ణప్రతిపాదితవాదమేకీకృత రోదసీ
కుహరంబు లగు ఘోటకతల్లజంబులు ముందు నుల్లాసంబుగా వెన్నాడ వా
గురజాలప్రముఖప్రధానసాధనసామగ్రిసము దగ్రు లగు వగణితమృగయాప్ర
కాండు లండ గొన నామలింగానుశాసనంబునకు వడి సింహాదివర్గ సంకలి
తంబై మహారాజాస్థానపుగిది నానావిధకవిప్రౌఢోక్తిసంకులంబై ప్రాకృతం
బులైవడి వల్మీకభవనిదానంబై తర్కంబు చెన్నున ఘటికల్పశబ్ద మేయుంబై
ఛందంబుభాతి మత్తేభశార్దూలవిక్రీడిత లతుణముకితంబై భరతంబురీతి సిం
హవిక్రీడితహరిణప్లుతకరిహస్తప్రసర్పితాకలితంబై యుత్తమకావ్యంబువడు
వున నవాచ్యమహిమంబై యలంకారంబు తెఱంగున ననుమవిషమవిన్యా
సంబై మీమాంసకవిధంబున నానాగమప్రభూత శాఖాపైభరిత్రకాశంబై
పాణినీయంబునునువున వృద్ధాంగగోత్రాశ్రితంబై త్రిలింగభాషానుశాసనం

ము చెలువున నున్న ద్రప్రాకారంబై యత్యద్భుతం బగు నక్షత్రాళీదీర్ఘకాంతా
రంబు ప్రవేశించి. ౧౭

## —శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. నలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను నీకబలకాననముం గా
జలజాతపత్రనయనుఁడు, బలశాననతనయుఁ బిలిచి పటువేగమునన్. ౧౮

సీ. అతులచాతుర్య మొదవంగ నమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాములందు
సంభవత్తత్త్వమానసంజ్ఞ*నరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప నద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కులఁ గ్రమ్మి భటుల్ రొదలొక్కుమ్మడిఁ జేయ మృగము లురవడి వెగడెన్
మిక్కుటపుస'వివాక్కులఁ, బెక్కండ్రునీతకవులు బెదరినమాడ్కిన్. ౨౦

క. జలజాక్షుననుపఁది తమ్ములు, బలుమృగముల వెదకి వెదకి పడఁజేసిరి దో
ర్బల మలర శాబ్దికోత్తము, లలయవిశేషముల నెమకి హరియించు క్రియన్.

గీ. అలసనత్త్వంబుల నసత్త్వములఁ గ్రియా†వ
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంత
సంగ్రహోయుత్తమతి నైనసాధు మౌళి. ౨౨

గీ మాన్యుఁ డైనట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యదూరాలంపుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరమరుదు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళతలే కన్నిమొదల వే కననయ్యెన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మః‡విధక్తిగోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నామ మెలఁగె సుచిరలిద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మిందుమాయ
లాడు రాజహంసంబు లగు నాయిమ్మంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాననవర
మహానసీలకంఠసంసేవితం బై శుకముఖసుకవినికరసముత్ఖగసౌభాగ్యం బై
తనుభవశ్రాంతినః స్వావహరణప్రవణం బై శరద్రాకాశకాంకాకలంకచ్ఛా

*అలరజేసి-మా †పరాశ్రయములు-మా ‡విభక్తి కోజ్జ్వలం-మా

యాచోరు ప్రభాధరంబై తెలిదీవిపైఖరిం బరిహసించు నొక్క కాళిందీనదీ
సుందరపులినతలంబున విశ్రమించి. ౨౮

క. కనియెం బద్మదళాక్షుఁడు, కననివినసిమేలుపుసమఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యచలంపుఁగోచిఁ దల మనుదానిన్. ౨౯

—శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట—

క. ఉపమానభావమును దన, కుపకారముగాఁగఁ దలఁచు నపఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనరై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

క. కనికని నిరతిశయానం, దనిధిత్వ(ము) గాంచియేని కమలదళాక్షుం
డనలేనిమదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమము పొగడున్.

గీ. ఏతదపఘనసంగతి నట్టిముదము, †విషయివర్గంబుఁ గైకొని వెలసె దానిఁ
గాంచుఁబునకేతదంగసంఘటనగలుగ, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాననంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాదమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్రదనం బొనగూర్చునేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. ౩౧

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తుసం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నట్టు లెన్నకొన నేరఁగనయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుగుబ్బలు గొప్ప‡క్రమ్మడిన్. ౩౨

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు, నవనిరసికులు గొనియాడుటరుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యాశరత్పద్మనయన
వ్యక్తిసుందర§కాన్యకృతాఖిలోరు, భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁ బోలునింతి.

సీ. ఇది మాన్మథోన్నత్యహేతు వౌటఁ దలఁప మదికిఁ పులొనరించుమరుసదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరుసచేతమెలంగు విపులబంతి
బంతిగా దిది కందుకట్టుగాఁ మెఱుంగ సోఁకిలినను మేలు సొగసుమెఱపు
మెఱపుగా దిది నిల్కడాలపుమైఁ దనరారమానసప్రియభావ మూనునంచ

*కాఁతి-మూ. †విషయ-మూ. ‡కొమ్మడిన్-మూ. §కాన్యకృతా-

యుంచఁగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తిచే మూస్యపికము
పికముగా దిది తెలికంటి బెళుకు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావ
ళియు భ్రూమనోరమతయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ
గర్ణశ్రీకలితయు నధరమధురుతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ
గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకు
సుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబాధుకయుఁ దనుమధ్యాంచితయు
రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనతటమాభిరామయు నూ
రుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతా
చపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న ది
క్కొమ్మ నెమ్మి, యేమున్నగున్నక్కైన వనమ్ముగా *నమ్మునమ్ము యని మనమ్మున
ఘనంబుగాఁ గొనియాడుచు నప్పుడవయోదవ్రుండు దండనుండు నాఖండల
నందను వీక్షించి యిచ్చంచలాక్షి యుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా
పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బనిచిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట—

క. సిరికి నలవడని శోభా, భర మీయింతికి నెనంగుఁ బద్మాక్షునకే
తరుణి యిది గృహిణి గాఁదగు, నరునా శిరమెక్కి యుండు టట్లు ఘటిల్లన్.

గీ. ఇట్టిసౌందర్య మొనరించునట్టిధాత
కమరు సృష్టి యీయింతి హానికిఁ గూర్చ
మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని
యన్యవనుఁ గూర్ప నయశోభ నది యడంగె. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నునిచఁ బొగడుచున్
†భోగిశతల్పుపనుపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ. నభయందుఁ బాడితనంస్తృతవాణిక్రైవడి మహాసరసిరోకలను హంసి
వలె నభఃస్థలమున జిలుఁగుఁజాముర సోగవఱువున నవమేఘపటలి మెఱపు
చెన్నున నాలయసీమఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవ
చెలువునఁ దరువున ఫలశాఖపోలికఁ, ‡బరమకావ్యంబున వ్యక్తిమాడ్కిఁ

* దమ్మున-మూ. † భోగిపర్యంకపనుపున-మూ. భోగిశరిపుండు అని కవిభావమువో. అది యసాధువు. ‡ బరమ-మూ.

బులినతలమున మెలఁగెడుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొందికుందరదన, వదనమీక్షించిమాధుర్య మొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిస జ్ఞలు కీదృ
క్షులు హేతు వేమి నీవీ, పులినంబునఁ దపము సేయఁబూనెడుమతికిన్. ౪౧

గీ. తేఁటియాటనికుసుమంబు తేట దోఁచు
నీదురూపంబు గనుఁగొన్న నిగ్గులాంగి
యక్షవరకాంత దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చటఁ బరమసాధనతఁ గాంచఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలనైన
ఘనఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తన్వులనేలెడు, దేవునిగా దాపుఁబట్టి చేటమొగమునన్
గీవి మనునగవుసిగ్గులు, తావుగొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †క్షాత్రకాధర్మమున కధిష్ఠాన మరయ
నీదురూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిరూప్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మౌట మాననీయత వహించు. ౪౫

ఉ. కావున నాయుదంత మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయసేస్తుఁడయి తెల్వి జగంబుల కెల్ల శ్రీనుఁ డ
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీనపాలిరమాధినాథుఁగా
దేవునిఁగా వరించుకొను ధీ కొని యిట్టి వ్రతంబు నల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యమునానది కధిప నేను, జన్మదేశైకతన సహజన్మఁగాను
నామధేయంబుచే నేని నరవరేణ్య, తత్సమాఖ్యఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. కల్గి మిత్త్రదయాంభోధి నీరజాక్షుఁ, దనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కానిపార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుండు ప్ర, సన్నుండగునో యనుచు కోర్కె సఫలతఁగాను టిం
కెన్నఁటికో తెలియదు నన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖముల్.

* బోధన-మూ. †క్షాత్రతా-మూ. ‡గాకున్న-మూ. శ్రీను.

కరము మనంబులోపల నఖండితభక్తి యుదీర్ణ జ్జకున్
హరిహరి యూఁటటు గని యుట్టికచాకచి సంఘటిల్లఁగన్. ౫౯

గీ. తలఁచి "యభ్యాగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగ జలదసాంగ
పీఠికాంభోజమాలి కావినరసులను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణుఁడునరుడు దనచెంతఁ గేలుగొనఁగ
భామ ముఖచంద్రుఁ డప్పు కాళిత వహించె
నిజుదక్కఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్నిరుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననదనుఁజగోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యోనీరజాక్షు
వదనచంద్రుని బాయు కవ్వారిగాఁగ, బాయకొనఁజేసె దనదృక్చకోరకముల.

చ. అపుడు ముకుందుఁడింతిఁ గని యంబుజమిత్రతనూజ నీకు ని
త్తరము ఫలించె రమ్మనుచుఁ దమ్ముల లేనగుమోము గ్రమ్మఁగాఁ
* దగవతనూర్భవం జెముట దగ్గయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృహనిశుగొంచు ధర్మజుని కేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కృష్ణుచ్చట దెలియంగఁజేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చపుఁ బ్రేమమున నిలిచి యనుపతియంతన్.

క. పురమున కేగుతలంపున, నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్కొని చనువేడ్కల్, పురమునకుఁ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘ కృతి యపార్థ మగునేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నాకుమదికి నెపుడు నయఁ బొపు మంగాన
నన్నుఁ బంపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు భావకుఁడు శ్రీవరామ్మ గోలంగుకు బావబిడ్డబిడ్డనిచే †సోమానుల
పెట్టుఁబెట్టుఁబట్టి తనవరుకటిరాకకు నాంతిపడసి యంతయు రా ‡నయ్యెడ్డ
కేల్గొంబిడ్డ ప్రామిస్సు సొమ్ముబరణి గన్నకన్నెఁ గొని నిజపరివారపరివృ
తుండై కదలి సంద్రంపుటగడిత పడయు బెడంగుప్రోలు మేలుబంతికి జని

* తపనతనూజభవన్ జలజం.యూ. †సోమానుల ‡నయ్యాండకేల్గొంబిడ్డ.

సీ. రమణీయనాయకరత్నంబు నంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
జంద్రరేఖకు నబ్బుసాంద్రాంధకారాభచికురముల్ దెరలించు చేగయంచుఁ
గృష్ణమేఘముచెంతఁ గీల్గొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలువేర నటంచు
నిదె సర్వమంగళాస్పదనాదలంటంగ మందాకినియె నేర్పుఁ గెందు నంచు
విధునిసేవింపఁగనుదార వృత్తి యనుచు, నీలవేణియె గోవిందు నెలవటంచు
నంబుజాక్షులునర్మోక్తులాడుకొనుచుఁ, గనుమదంబొప్పుమధువైరిఁ గ్రమ్మికొనఁగ
సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణనీలాబ్జతోరణము లనుప
*సేసనీరోగిఁ గ్రొమ్మి చెన్నారుకెమ్మోవి నమరేంద్రకాంకచాప్యయుఁ బూన
నవవిల్తువల్లెఁ బోలినపింఛపుపై వాలుచందమొందుచుఁ గీలుజడ చెలంగ
బిగువుకెంపుకు(ము)లోఁ బెడఁగుదిట్టమెఱుంగు జన్నిదిట్టలోకింతచలన మొంద
హారములు దూఁగఁ గా ననియాడఁ దొడఁగ
వలచునూర్పులు పెంపెక్క పలుకు నిక్కఁ
గంకణధ్వాను లలతాళగతుల నెనయ
శౌరితల యంటె నొక†మహారాజఘున. ౮౪
వ. ఇట్లు యదుకుంజరుండు సాభ్యంజనుండై యుక్తకుంజరయాన వైదండ
యొసంగఁ గ్రొమ్మెఱుంగు నండగొను ఘనాఘనంబునుబోలె ధరాధరశృం
గోన్నతం బగు నవగాహనగృహంబుఁ బ్రవేశించి యుక్తమించుఁబోఁడి వల
పులు గించు మంచిగంధంబు‡టటకిలిం బెన్నరుల నూనియ గగుఁర్ౘదగఁ
జేయ మఱియుక్కగొమ్మ కమ్మతావు లూరు జలంబుల జలకం బార్చి నే
క్కరంగులాఁడి బంగరురంగుల తెఱంగుల మరుంగు కడఁ జేయు దువ్వలువకవ
యొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమం
దానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమ
విచిత్రాస్పదంబు ను జాపకమాలోత్పలమాలికాభ్రమరవిలసితలసితంబు ను
మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానావిదార్థసమృద్ధంబును బ్రస
న్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగతాఖి
లాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్క నక్కెంబు లాడు వివాహ
వేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కురుల
తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రాసిలంబులం దేర్చి సురభిళకు

* సేదనిరోని-మూ. † మోహావారి-మూ. ‡ టంటకంబుక- § దంగంజేయు-మూ.

సుమమాల్యంబులం జేర్చి యంతరంగాంతఃకరణపూర్ణతా బహిరుద్గీర్ణసత్త్వ
గుణవైభవభ్రమంబు నొసఁగుచుండు దివ్యచందనలేపనం బమర్చి యమూల్య
రత్నకలాపంబులఁ దత్తదుచితస్థానంబులఁ గుదిర్చి యా కాళిందీముఖారవింద
* దర్శనాదర్శనం బీయాదర్శనంబు దర్శింపు మనుచు మనోభవప్రతిదర్పణ
ప్రదర్శితబింబప్రతిబింబైక్యంబై తద్దర్శనస్పృహఁ బొసఁగఁ జేయుచుండఁగ నమ్మనో
రమణ మకురకపోల రోచిఃసిద్ధంపు నిలువుటద్దంబుఁ దెచ్చి ముందట నిడ
నయ్యవసరంబున నచ్చంపు నెలదాల్పు నబ్బాణువలయొకకొమిసికిం బ్రాతిధ
ట్యంబు వాటించి యఖండచండకిరణమండలంబు దాల్చెనో యన నలరారు
మణికిరీటంబుగల శిరంబును గచప్రచయసజలజలదరుచిగళన్ముక్తాఫలజాలం
బు పోలిక నెలుంగు తెలిమ్రానిపువ్వులబాసికంబును దద్గంధాస్వాదనలోలు
కబంభరడింభంబులవిడంబించు నలకంబులు గలయలికంబును దావిదామర
పువ్వారు మదిఁగదురఁ బఱతెంచి కదలకనిల్చు నేటికూనలేమన బొలుచు
కమ్మకస్తురిచుక్కబొట్టుగల నెమ్మొగంబును నిజాంతేవాసులం బోవ మసవి
శేతెంచి కర్ణాంతికంబుల నిలుచు వేలుపుతొలువేలుపజ్జలనజ్జగించు వాఁడి
సుపాణిమత్తియంబుగోరంటులు గలకర్ణద్వయంబును సకలంకాపూర్ణశశాం
కశకలశంక నంకురింపఁజేయు నివాహానికఘర్మచిలికజ్జలబిందువు పొందుఁ
గాను కపోలతలంబును గంధరాభిధానబంధురకంబునిర్గళత్స్నిగ్ధమౌక్తికమణి
రాజరాజలో యనఁ బురిణింమనుదంచన్ముక్తాహారభేదంబులు నంతరనవకాశ
బహిఃప్రకాశద్ర(వ్య)విషయకానురాగంబు పెంపుఁదలపించు కౌస్తుభనామ
మణిసార్వభౌమంబును గల శ్రీవత్సవనమాలికామనోహరవిశాలదోరంత
రంబునునవికలమణికీలితబలభిన్మకలస్తంభజృంభణసంభావితంబులగుచిరత్న
రత్నకీలితకేయూరాంగదవిలసితభుజాద్వయంబును మణిబంధప్రభావలయం
బున నలరారు మణివలయంబుల నలరుకరంబులును నిజోదరాంతరావనదనం
తవనజాండభాండస్థైర్యకార్యార్థంబనా నిబద్ధమణిమేఖలం బగు కటిప్రదే
శంబులును జలినీటియేటి†కిత్తిముమ్మి నా మగరాల తేటనీటు లుద్ఘా
టించు కటకంబులు గలపదద్వయంబును గలిగి లక్ష్యాలక్ష్యపదార్థజీవితం
బగు నమ్మహాపురుషునకు నిట్టిబులం కార్యత యబ్రమే యనుచు వార్యులెన్న
నలుంగుచుండె నప్పుడు. రాగి

* దర్పణంబియాదర్శనంబు. † చెన్ను.

—॥ కాళిందిని జెలు లలంకరించుట ॥—

ఉ. ఉద్భటగాఁగ నొక్క చెలి యూహనగాత్రికిఁ గొప్పు దిద్దఁగాఁ
బొద్దుముశేవి మల్లెలపుఁ బువ్వులదండల గొప్పుగొప్పఁగన్
మెచ్చుగ నిల్పె నొక్క చెలి యానవిలోచన పాటి గైకొన
స్వచ్ఛ నగాతులం బఱగ వచ్చిన కీర్తులమూర్తిగో యనన్. ౯౭

చ. కుటిలములైన ముంగురులఁ గూర్చి మెలంగెడు కామినీమణీ
నిటలమునందుఁ గస్తురిని నచ్చెలి యొక్కతె బొట్టుఁ బెట్టఁ దాఁ
గుటిలతమాన ఫాలమయి కోమలచంద్రుఁడు వంకపూనుచుం
జటిలకలంకముం గటిలనంగతి యుక్తిలిఁ గాంచెనో యనన్. ౯౮

క. కంకజముఖ కొక నచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమచూర్ణం బహితా, తంకముగాఁ గబరి సీరశా దాల్చెనన్. ౯౯

చ. వదువు మహేంద్రనీలమణివాయకమా నుగరాల బొట్టుచేఁ
గమనలరారు ముత్యపుఁ జోకాటపు బొట్టు నెలంత గొప్పెనన్
విమలకపీఁక నచ్చెలులు వెంబడి బొగ్గొని రా మహాభయం
బడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చిన సంతకశాంకుఁ బోలుచున్. ౧౦౦

గీ. కంటఁ * గాటుకదీర్చె నొకతి కొమ్మాస్త, నరసిజాక్షికి గనుదోయి † సామ్యసాక్షి
దళిన మొనరింకఁ గోరినఁ దాపృగీక్ష, గల్గుసిద్ధాంజనము బెట్టుకరణిఁ దోఁచ.

గీ. ముద్దులాఁడికి నొకబోఁటి ముత్తియంపుఁ, మేలుముంగర ముక్కున ‡ మెఱయఁ నొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించు, చంద్రుమెలఁగినయ్యున్నెపుఁ జముకనంగ.

క. శ్రీకారసామ్య మాకృతి, నేగా దర్పప్రకాశ నేసియుఁ గలదా
జోక(ను)వీయు(వ)తులా, కపునవరత్నకుండలములు దైవాఱన్. ౧౦౩

క. అంజనరుచిదీప్రాసిత, మంజులతరపలదపాంగమంజరి మిగులం
గంజాక్షి గండతలమున, నంజక § రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౦౪

క. అరుణాధరయరుణద్యుతి, శరణాధరసీమఘటితసమ్యగలక్తా
స్ఫురణంబుఁ గనక యొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁ దలఁచి తెలినిన్నానన్

గీ. తొలఁగకుండుసువర్ణబింబముల జెంది, మధురబంధంబు గాంచినమ్మదమునించి
సాధువాగ్రీతిఁ గైకొన్న దారుకంచు, కంబులోఁ జన్నుఁగవవ్యంగ్యగతిఁ జెలంగ

* కాటిక— † సామ్యసాక్షి—యూ. ‡ మేరనొప్పె—యూ. § రుచిరంపుబిందు—యూ.

ఉ. పాటలగంధి నీ దగు వారి పానుపునందు వసించు నత్తఱిం
బాటలగంధు లింక పెరఁ బ్రాడి పాటలు నవ్వులాటలున్
మాటికిఁ గలుదక్క కెపముం గుడి రుక్మిణిమారు సంకపు
బ్రాటపుపీట తెన్న నినపెక్కుపుమాటలు మీకుఁ గార్యమున్. ౧౪౩

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆమెకుఁ బదివేలుబలుకు, దాయలుగలవేల్పుపేడు నన్నామునంగం
జాయఁగ మదురుంజు దమ్ము, మాయను భర్తకు నొసంగ నభిరతి వచ్చెన్.

ఉ. వేయుగు పాదప లోగలిగ నిస్త్రీ ఘీతుహిమంబు గాంచుఁగా
చాయపొలం తేజు డతి నత నెక్కై తిగుసీకు నక్షమం
బాయపు మాంద్యకంగుతులు భామిని శ్రీకి పిన్న మిక్కి జే
చాయ నొసంగ దంచు వాలిసాత్యకిని ఋష్యలు నవ్వుచుండఁగన్. ౧౪౪

గీ. మాంద్యకంగుతులన్ని యమానుబద్ధ, సమసనంబచ్చుటనుపట్టి జానుమీకు
ననుచునవ్వుచు నుత్తరం బ్రాసికొనుచు, వారికి నసితుండు పీడియంబమరనిచ్చె.

ఉ. తెలివి దలిర్ప నక బలిఁ దీసికొఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
బెలిబలుమ్రాను మోము సకితేటలుగల్గిన గిష్టి సిగికి
న్వాలయుఁగఁ బంచి లక్ష్మి(లో)తికి స్మితనవ్వయ్య నిష్టవస్తునం
కలన సమస్తలోకముల గరివ మొప్పఁగఁ దన్ని కంపుడున్. ౧౪౫

— లక్ష్మిగీతలు —

క. అంతట నంతటి మట్టు, బంటీకీరము బహరిగా నందవురో
ధ్యంతరమున నోలాడఁగ, సంతసిచరుచుచుఁ గూర్మి నల్లునిఁ బలికెన్. ౧౪౬

ఉ. ఎల్లజగంబు లేలు పరమేశ్వర భక్తజనావనార్థమై
యుల్లసితంపుమానవసమీహిత చేష్టలు గాంచుసామి నీ
వల్లుఁడవైతి గానఁ బరమాద్రికి నవ్వులఁ జిమ్మచీఁకటుల్
ద్రొల్లఁగఁ జేయు నట్టిడికటుత్వము గాంచు ప్రభల్ ధరించిరన్. ౧౪౭

గీ. ఎంతకాలంబునుండియో మొదయకుండు
కటుతమోగ్రసత వారింపఁ బాలుపడితి
వస్తమయహాన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౮

గీ. హారణ మొసఁగుట మామకు నర్హమెంచట, నఖిలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల,దక్షిణాలోకభర మిచ్చుతలఁపు నాది.

క. హరిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొనరింపుము నానతి, పరమపురుషుచేతఁ గొను మనుఁబలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపవు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీంసతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౪

గీ. భాగ్యసౌందర్యశీలాసపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోన విక్రియోత్పత్తి గగన,కుసుమసాదృశ్య మొందింపఁ గోరవమ్మ.

గీ. అంబుజాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుము హరిజాయ ననుసరించి
హరికథానుగతిస్ఫూర్తి నలరి నీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. పగలుగావించి మాయమ్మ పగలు సేయు, వాని బిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము ౧౫౫

శా. అమ్మా మన్నిడఁ బాసితంచు మదిలో నావంతయైన న్విచా
ర మ్మానం బసిలేదు కాంతలకు సబ్రహ్మే యదెన్నంగనై
న మ్మానా భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపా
సమ్మానింపుచుఁ బాయఁ డెప్పుడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౫౬

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హారణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రి పట్టికిన్
హారణమొసంగు టెజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బితృస్వకాంతు ధృఢమై మదిఁ బుట్టెడు నట్టిబోటికిన్. ౧౫౭

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోకచారస
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావమునొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములోఁ స్మరింపఁ గనునట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౮

క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తరళేక్షణచే
వనజాప్తు లోకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

౪. కుహనారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలికన్యా
పహారణపరభుపదూషణ, సహజావైరాజ్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలకృపాపోషిత కటాక్షసాదిత పాండిత్యధురీణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితచక్రపాణిశశాంక అభినవ
పన్నగభట్టారక అహోబలకల్యాణవ్యాఖ్యానవినుతా
పాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిందీకన్యా
పరిణయం బనుమహాప్రబంధమునందు
పంచమాశ్వాసము

వ. వెండియు నొక్కతె తెలచెక్కులాఁడి యచ్ఛకుచకొమ్మ కిట్లనియె ౨౧

క. నను వైనపూలపాన్పున, మనసూఱుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమ్మ్యాగర్వము, మనమున నీ కెల్లఁ జెలఁగు మంజులవాణీ ౨౨

వ. పిదప నొక్కబింబాధర యన్యబింబాస్య కిట్లనియె. ౨౩

క. హరిఁ గూడక తుది శైత్యం,బరయుచుఁ గరాగ మేనఁ బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు వన్నెకు, దరియా(వక) యిట్టిలజ్జ దా నేటికనునో. ౨౪

వ. మఱియు నొక్కప్రోడ యచ్చెరువుకంటి కిట్లనియె ౨౫

ఉ. అప్పుడె నీవు నీమగఁ(డుందపు)గొన్నవ లచ్చిరీతి నీ
వొప్పులఁ గుప్పుచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గెం
పొప్పు మ నీదు మోవి దళనోదితరాగ మతండు సేయఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యొందుఁ బోవునో. ౨౬

వ. అంత నొక్కనిక్కులాఁడి యచ్చపుఁదనాలకుఱ్ఱ కిట్లనియె. ౨౭

మ. ఉకులజ్జాధర*గహ్వరంబునను రాగోద్వృత్తి కీవేళ దా
పరమున్ జేసిన మర్మముం దెలియ మాకజ్జ వృథా గాదె యీ
వ్వరిశైనం గవఁ బేటఁ జొగు మదిగోఁ బాటిల్లురాగంబు శ్రీ
రవస్త్రాంబుజరాగనామకమహార్ణోజవం బంకటా. ౨౮

వ. అనంతరంబ యొక్కపృథునితంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు నీకు ఫల మే మని చెప్పఁగఁ గాక సేసె దో
కాంతరో గట్టివాయి యని కాంతుని నన్నుడిఁ దోఁచునన్ను శ్రీ
కాంతుని యందఱుం గలయు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. ౩౦

వ. తరువాత నొక్కయుగ్మలి యక్కోమలి కిట్లనియె. ౩౧

క. అతినిబిడలజ్జ గా దిది, పతికి నదిలోన నుబిక సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార ముడిగి యున్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నింపుమీఱ నగ† వాఁగుచు నచ్చెలులట్ల నడించి యో
చిత్తజుముల్కి కల్కి యిది చిత్తము నిల్పుచు వాదు విన్నరం
బిత్తఱి వాలనింపవల దెంతయుఁ బ్రొద్దు నవంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొక్కఁగ నెంతయు నంచుఁ బల్కఁగన్.

---

* గహ్వరము=నెపము. † వానుచు.

మ. లలనామన్మథ* మూర్ఛదృష్టి నిలనభ్రాగాఢగాఢేగనం
†కలనాదీవ్యదవత్రపాధుని నయుగ్మా ‡నిం డితభ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్దీగినాయకమణిస్తంభంబు నందుం గొనన్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాంగునఁ గౌఁగిలింతు నే నను క్రియన
బ్బాలిక కౌఁగిటఁ జేర్చెను, నీలస్తంభంబు సిగ్గునరయం గ్రమ్మన్. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సభాజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి ముందట నిలిచిన నీలవేణీనిలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసన్మకరనందవాసుదరేఖా రేఖావిలాసన ముల్లాసబలప్రబ(ల)సిద్ధవదాంతరామోదజలధిఫేనాయమానం బగు మందస్మితంబు ముఖాంబుజహాసంబు నలంకరింప ని ట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, కలిగిన భాగ్యమున మనసు కనురంజిల్లన్
జలజాతనయన మిముఁ గన, వలయుచు వచ్చుటయు కాని వార్తలు గలవే.

క. అలికుంతల తుణదాముఖ, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలిపెఁ గొను కృష్ణకథను, వఁ గొను సితుణదముఖము వదలు నెతముమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాకురంగనయన సౌభాగ్యమునకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూషణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందటకు నిడి వెడలి చను మంజు నవతరింపం జేయఁ జాయకట్టిక నిచ్చట్టు ట్టినదార దంపువెట్టినదను లఖం జనితొద మమ్మకో తిరిగి వచ్చెద మిచ్చట నుండుమని మరుంగుగాఁ బల్కి యచ్చెలుకలగోలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తి ప్రవిలాసవైఖరుల నంచద్భావాలు నర్తిల్ల ల
జ్జకసంవిస్మితకాంతమఖ్యాలలిత శ్రీవీక్షణాళీసితా
సితమంకేసుహామాలికన్ మదనకౌత్కేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి జేం గొనఁగన్ సేవార్థమై కామకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ డ
క్కామునితండ్రిఁ గాముని చేకొటపుబాణము భామ చూచు చుం

---

* యత్న † కలనంచిక్కపదత్రపా. ‡ నింవిత భ్రాంతి.

మగువ నీకబరి మన్మథకరాయుధముగా జాలువాజలపోఁతజాను గాంచె
భామ నీక్రొమ్ముడి బర్హిబర్హంబుగాఁ జంద్రకసంబంధచారు వయ్యెఁ
జెలువ చిత్రాళిపాళిగఁ జికురభరము, నరసతభరించెఁ జంపకచ్ఛాయడాయ
ననుచునఖరోచులంతటంగలరుచుండ, గోప్యనువ్వెనగోవిందుఁ డొప్పమీఱ

చ. కలికిరో మోము వాంచుటకుఁ గారణ మేమి కలంకిచంద్రునిం
దులఘుతోయింపఁగాఁ గలుగు దుష్టుల కల్గుల నైఁపలేకనో
తెలివి(కి)దప్పి పామరు లతిత్వర సామ్యము కల్గినంతనే
కలుఁగున పాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ............ తోఁపటు పాటి ప్రొద్దు రా
మిక్కిలి మాఱుపంకజము మిన్నక ఖండితమాన్య లీనృపా
వాక్కుల కేల జిహ్వ యలవచ్చిరి పంకజవైరి చంద్రునే
నుక్కడఁగించుమో ............ యనందగునే పయోజముల్. ౬౧

ఉ. పంకజనీలపంకరుహభావము గాలుచు కన్నుదోయి మే
...పంకము నైఁచునీగమ ఖపూర్ణకుపాకరుఁ జూచి చూచి యీ
పంక(జబృంద పల్లఁ దల) వంపులకుం దగఁగాక యన్వమే
పంకజ* నేత్ర నీకుఁ దలవంపు లహేతుకఁ జ్జ మొత్తురే. ౬౨

గీ. వనితరో మోము చందగు వాంచెదేల, కుటిలకుంతలతిమిరంబు కొర...
...నో యనుశంకనో వచ్చువెట్లు, కటలపాదేందు నేమించ నేరదెద్ది. ౬౩

సీ. చెలువ ! జ్జను మోము వాంచితి వటన్న
నవధరించితో నీవు ముఖార్థహతిగ
విను .......... హతి దాన నెనయు నెట్టు
లదియు నొకచోట దోషత నంద దరయ. ౬౪

చ. మృగమదచిత్రకాకృతిని మోముకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁడేరదా(కృతివహించం)ను నటంచును మోమువాంచుటో
మృగ వసుగ ధ నుప్రియ నమ్మృష్ట మశృంగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంక మే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మే లగుఫాలము పిల్లతేఁటికిం
దగు లగుకేతకీదళము దా నగునం చొగి నెంచి కొక్కపే

* కేరి) † మదుదేరదా

చ. నెల యిది యైన మన్నయనసీరజముల్ వికసిల్లునట్లు దా
నెలయు రసా(౦బు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహంబు గానిచోఁ
గలిగడు నేగతిన్ భ్రమరకంబులసంగతి దమ్మియైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు సంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. వీనులయం దం(లం)కృతిగఁ బెట్టిననీలపయోజపత్త్రముల్
భాసురనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి ధరించు నన్నమా
టానఁగరా దొకించుకయు నానఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి యై మొగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండుపుల్గులై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ నదెట్టులోచు నీ
యాయతనేత్త్రముల్ మెలఁగు నౌర ముఖాబ్ధివిచిత్త్రవైభవల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోడ్పున మోముఁజంద్రునంద మెలఁగుచున్
సురుచిరనీలపయోరుహ, పరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁ జెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదనమ్మాదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుదొలఁగ
నెరి మొగంబెత్తి చూడవే నీలలాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గుపడువేళ దప్పవే సిగ్గులాఁడి, నన్ను మన్నింపఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపులపేరుగన్నపరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంఛదె మోము నర్థినం
తాపము వాప పంపదఁ దక్కువ చంద్రుఁడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి* వేఁగుగాంచు, కన్నులకు నిప్పుడుం బద్మయుగళములకు
సాటి జెప్పంగ నమరునే సాటియగునె, నలు నలరెడుజలజంబు గలిగెనేని. ౮౧

మ. అరవిందైవనుఁ దొంటికన్న † నెటియానందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెట్లు సాటి యనఁగావచ్చున్ (వ)సంకోచతన్

* వేగు † నెరియానందంబు.

